Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా

గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆశ్వయుజశు॥౧ (౧౨-౧౦-౧౩౫౦ ఫ.) సోమవారము. ★ సంచిక ౮౦



# ఇరాను పూర్వరాజు రాజ్యత్యాగము

## రష్యాకు బల్గేరియా సమాధానము

### రష్యా జర్మనీల యుద్ధము

రష్యా జర్మనీలకు జరుగుచుండే యుద్ధములో ఉత్తరరంగమందు జర్మనుసేనలు లెనిన్గ్రాడువద్ద అన్నిటికంటె బలమైనదుర్గములను భేదించుకొనిపోయినట్లు ఒకవార్త వచ్చినది. ఎస్తోనియాకు ఎదురుగా బాల్టిక్ సముద్రములో డాగో మరియు ఓసెల్ అనుదీవులకు మధ్యనుండే వరంసో అనుదీవి జర్మనులకు చిక్కినదని ఒకవార్త. వాయవ్యరంగంలో రష్యనులు స్లాటిన్ అనుపట్టణమును లడోగా సరస్సుపైనుండే రష్యను పారిపట్టణమును పట్టుకొనగలిగినట్లు సెప్టెంబరు ౧౪వ తేదిన వార్తలువచ్చెను.

ఇక మధ్యరంగంలో స్మోలెన్స్కు నగరానికి ఈశాన్యములో ౩౫ మైళ్లదూరములోనుండు యార్త్సెవో పట్టణమును రష్యనులు తిరిగి పట్టుకొన్నారని సెప్టెంబరు ౧౪వ తేదినాటివార్త. ఈపట్టణము స్మోలెన్స్కునుండి మాస్కోకు పోవు పెద్దరస్తాపై నున్నది.

దక్షిణరంగంలో జర్మనులు నీపర్ నదిదాటి తూర్పుతీరమందున్న క్రెమెన్చుగ్ అను నేకఫ్యాక్టరీలుగల పట్టణమును పట్టుకొనిరి. ఈపట్టణమునుండి ఈశాన్యంగా ౫౫ మైళ్లదూరంలో ఉన్న పోల్టావాకును అక్కడినుండి ఖార్కోవునకు ఒక రైలుబాటయు, కాకమాక్ మీదుగా డ్నియాంపెట్రోవ్స్కు వరకు ఒక రైలుబాటయుపోవును. ఖార్కోవ పట్టణములో అనేకగొప్పపరిశ్రమలుగలవు. ఇపుడు ఈపారిశ్రామిక పట్టణమునకు భయమేర్పడినది. కీవునగరమును అదిక త్వరలో స్వాధీనము చేసినట్లుపట్టుకొనవలెనని జర్మనులుయత్నించుచున్నారు. కీవుకు ఈశాన్యమున వమాంటోవ్ నుండి ఆగ్నేయమున క్రెమెన్చుగ్ వరకు రష్యాసేనలు కీవునగరమునునిల్పుకొనుటకై పోరాడుచున్నవి. జర్మనుసేనలుఇపుడు క్రిమియా ప్రాంతముమీదికి పోవుచున్నవి.

ఒడెస్సారంగంలో డాల్నిక్ ప్రాంతమున పడమరగానుండే కొన్ని ఉన్నతప్రదేశములను జర్మనుసేనలు రుమేనియనుసేనలు ఆక్రమించెను గాని తుదకు రష్యావారిచే అవి తిరిగి ఖాళీచేయబడినవి.

క్రిమియాను పట్టుకొనుటకై జర్మనుసేనలు బాలతీవ్రముగా ప్రయత్నించుచున్నవి.

### ఇరానులో క్రొత్తరాజు

ఇరానులో పార్లమెంటువారు సెప్టెంబరు ౧౭వ తేదిన సమావేశమయిపోయిన ఆంగ్లేయులజరిగిన ప్రభుత్వవిధానమునకు తమరాజుగారే కారణమని తీర్మానించి, ఇకమీద రాజుకు సర్వాధికారము ఉండకుండ ప్రభుత్వము పార్లమెంటుకు బాధ్యముగుండే రాజ్యాంగపద్ధతిని నిర్ణయించిరి. అందు చేరాజుగా ఉన్న షాగారు తనకు స్వస్తినివచ్చినదని యు, ఇందుకుమంచిసలహా నియ్యవలసినదనియు ఇరానులోనుండే బ్రిటిషురాయబారిని ఒకరహస్యదూతద్వారా అడిగెను. అరాయబారి రాజాగారిని రాజ్యపరిత్యాగము చేయవలెననికోరిరి. అందుపై రాజాగారు రాజ్యమునకు తన ౨౨ఏండ్లకుమారుడగు షాపూరు గారిని నియోగించి ప్రధాననగరము వదలి ఇస్పాహానుకుబయలుదేరిపోయెను. క్రొత్త రాజా క్రొత్త రాజ్యాంగశాసనము ప్రకారము రాజ్యము పాలించెదనని సెప్టెంబరు ౧౭వ తేదిన పార్లమెంటులో ప్రమాణముచేసెను. ఇరానులో కొందరు రాజకీయఖైదీలు వదలబడిరి. క్రొత్తరాజుగారు పార్లమెంటుశాసనముల ననుసరించి పరిపాలనచేయుదురు. ప్రధాననగరమందలి నేషనల్ బ్యాంకు రాజుగారి ఆభరణములున్నవని స్వయముగా కనుగొనుటకు పార్లమెంటునియోజించు కమిటీ నిపుణులకు అవకాశమియ్యబడునవియు పార్లమెంటులో ప్రధానమంత్రిగారు ప్రకటించిరి. బ్రిటను, రష్యాల సేనలు ప్రధాననగర సమీపమునకు రాకూడదని ఇరానుప్రభుత్వము కోరినట్లుగూడ ప్రధానమంత్రిగారు తెలిపిరి. ఒకవేళ వచ్చినను విరోధులుగా రారని చెప్పిరి. తుదకు రష్యా బ్రిటనుల సేనలు సెప్టెంబరు ౧౭వ తేదినుదయం ప్రధాననగరంలో ప్రవేశించ ప్రవేశించినవి. ఇరాను ప్రభుత్వము వారు ఎంతసదుద్దేశ్యముగలిగియున్నను తమకు తామే అప్పనగరమునుండి జర్మనులను వారల మిత్రులనుపంపించివేయలేక పోవుచున్నారుగనుక ఇట్లు బ్రిటను, రష్యాల సేనలు ప్రవేశించవలసివచ్చెనని బ్రిటిషుప్రభుత్వమువారు ప్రకటించినారు.

### రష్యాకు బల్గేరియాజవాబు

రష్యావారిదివరలో బల్గేరియాకు చేసియుండిన హెచ్చరికకు బల్గేరియావారు సమాధానమిచ్చినారు. రష్యావారువీటినితమపై కుట్రచర్యలని అనుమానించుచుండిరో అవిశ్వదేశరక్షణకై గైకొన్నచర్యలని వారు తెలిపినారు. ఈ సమాధానముతృప్తికరముగాలేదని తిరిగిరష్యావారు తెలిపినారు. అందువల్లఇపుడు రష్యావారు బల్గేరియాపై యుద్ధముప్రకటించవచ్చునని అనుకొనుచున్నారు. ఇంకొకవైపున రష్యాపై యుద్ధంలో బల్గేరియా చేరవలసిన సమయమిపుడువచ్చినదని జర్మనీభావించుచున్నట్లు ఇటాలీయ ప్రభుత్వానికి తెలియచేయబడినదట ఇక అనువారాలలో ఈ బల్గేరియావైపునుండి జర్మనులు రష్యావారి కాకేసస్ ప్రాంతముమీదికిదండెత్తి అక్కడినూనెగనులను పట్టుకొనేఎత్తులోనున్నట్లు కొన్ని వదంతులున్నవి.

### చైనాలో యుద్ధము

చైనాలో ఉత్తర హోనాన్ రాష్ట్రములో జపానుసేనలు క్రొత్తగాదండయాత్రను ఆగస్టు ౨౭వ తేదినప్రారంభించినవి. చైనాసేనలు వాటిని ఓడించి టాయుషాన్ కొండలప్రాంతమును వశపరచుకొనినవి.

షాన్సి, హోపీరాష్ట్రములలో కొండలనానుకొనియుండు చైనాకమ్యూనిష్టుసేనలతో ఒకలక్ష జపానుసైనికులు పోరాడుచున్నారు. జపానువారలు ఇక్కడమొదటిసారిగా పారషూటులలో సేనలనుదింపుచున్నారు. ఈసేనలు ఉత్తరమునుండియు ఈశాన్యమునుండియు, ఆగ్నేయమునుండి యుదక్షిణమునుండియు చైనాసేనలపైకి దాడివెడలుచున్నది.

### రేడియో ప్రచారపు అంశములు

బ్రిటిషు రేడియోప్రచారములో ఈక్రిందిఅంశములు చెప్పబడినవి: —

తూర్పుఆఫ్రికాలో ఇటలీవారి సామ్రాజ్యముపోయినది, ఇటలీని జర్మనులుఆక్రమించియున్నారు. ఈజిప్టుసరిహద్దులో బ్రిటిషుసామ్రాజ్యసేనలున్నవి. ఇరాకు, సిరియాలలో బ్రిటిషుమిత్రమండలివిజయముంచే మధ్యప్రాచ్యంలో స్థయిర్యమేర్పడినది. టర్కీతో సేరుగా బ్రిటనుకుసంబంధమేర్పడినది.

అమెరికావారు తమను శత్రువుఏమిచేసినను బ్రిటనుకు సహాయముచేసెదమని చెప్పుచున్నారు ఐస్లాండులో అమెరికాసేనలున్నవి, ఉత్తర అట్లాంటిక సముద్రంలో అమెరికా గస్తునౌకలు తిరుగుచున్నవి,

సూర్యగ్రహణము మహాలయము శని ఆదివారములందు సంభవించినందున కార్యాలయమునకు సెలవిచ్చియుంటిమి అందుచేతపత్రిక ౬ పుటలతో కొంత ఆలస్యముగానెళ్లుచున్నది. (గో. ప. సం.)

### పరోపకారిణీ బాలికాపాఠశాల శ్రీసీతమ్మగారి స్మారకనిధి

ఈనిధికి ఈదిగువవిరాళములు అందినవనిమాకు తెలుపబడినది: —

౧. శ్రీ సేట్ కిషన్లాల్ గారు. శ్రీ రాజాబహద్దురు వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ గారిపరంగా రు ౫-౦-౦. ౨ గుప్తదానము శ్రీ కే. టి. యస్. చారిగారి పరంగా ౫౦-౧౫-౬ ౩. శ్రీ ఆర్. జెనిఅల్ గారు ఫొటోగ్రాఫర్ బి.జి. రూ-౧౦ [౧౧ ౯-౧౧ హాలీ]-

ఈ తేదీ వరకు వసూలు హాలీ సిక్కా రూ ౩౦౨-౮-౧౦. ఈనిధినివృద్ధిచేయ దానపరులెల్లరు తోడ్పడప్రార్థితులు.

## తెలంగాణా దినపత్రిక

ఏర్పాటులు ఇంకను పూర్తికాలేదు; కనుక దినపత్రిక ౧౫జూలై ౧౩౫౧ఫ- నుండి వెలువడజాలదని తెలుపుటకు చింతిల్లుచున్నాను- ముందు ఎప్పుడు వెలువడునది పత్రికాముఖమున తెలుపబడునని మనవిచేయుచున్నాను-

మాడపాటి- హనుమంతరావు

(గోలకొండపత్రికా సంఘము పక్షమున)

## విశాఖపట్నం ఆంధ్రమహాసభ అధ్యక్షత

### సర్ యం. వెంకట సుబ్బారావుగారు అంగీకరింప జాలకుండుట

విశాఖపట్నం, సెప్టెంబరు ౧౭

సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారిని సన్మానసంఘమువారు ౨౭వ ఆంధ్రమహాసభకధ్యక్షునిగా సూచించియుండిరి. ఆయన సన్మానసంఘమువారి సూచనకంతేయు కృతజ్ఞతయు, సంతోషమును తెలుపుచు, మహాసభ జయప్రదముగాజరుగవలెననికోరుచు కొన్ని కారణములవలన అధ్యక్షతవహించుట కవకాశము లేనికి మిగులవగచుచు సన్మానసంఘమువారికి తెలిపిరి

(ఆంధ్రపత్రిక)

### బొంబాయి తెలుగు రెడ్డిసమాజము

పైసమాజమువారి "తెలుగురెడ్డికాపుసభాగృహము" బొంబాయినగరంలో కామాటీపురమందు అలెగ్జాండ్రియాసినీమాకు వెనుక నిర్మితమైయున్నది దానిప్రవేశోత్సవము ఈసెప్టెంబరు నెల ౨౦వ తేదీ సాయంకాలము ౬½ గంటలకుకోలాబాజిల్లాకలెక్టరుఅగుక.బి.భద్రపూర్ గారిచేజరుపబడును. శ్రీయుత హెచ్-యస్- మునిరెడ్డి,బి-ఏ ఎల్ఎల్-బి-అడ్వొకేటుగారు అధ్యక్షతవహింతురు-ఆసమయములో నలుగురురెడ్డియువకులు విద్యాపరీక్షలలో ఉత్తీర్ణులైనందుకును, డి-యల్ పటేల్, యన్-యం-పటేల్ గార్లకు వరుసగా రావుసాహెబ్ బిరుదము, కెయిసర్హిండ్ పతకము లభించినందుకును సన్మానములొసగబడును.

రష్యాలోను ఇతరచోట్లను ముందుకపోలున్నవి. జర్మనులయుద్ధసామగ్రికి చాలనష్టముకలిగినది అయినను సంతృప్తిపడి యుండ వీలులేదు.

## ఖద్దరు, హరిజన, విద్యావ్యాప్తిమున్నగువాటి వారోత్సవములు

### ని. రా. ఆం. కార్యకారిణీసభ తీర్మానములు

హైదరాబాదు(దక్కన్), ఆబాన్ ౧౫.

ని.రా.ఆం. కార్యకారిణీసభా సమావేశము వృషసం॥ర భాద్రపదబ౧౩ (౧౪-౧౨-౫౦) శుక్రవారము, కార్యక్రమము మిగిలిపోవుటచే తిరిగి మరుసటిరోజు (౧౫-౧౨-౫౦) శనివారము సాయంత్రము ౪,౫-౩౦లకుజరిగినది. అందు తీర్మానించబడిన తీర్మానములవివరము లిట్లున్నవి.-

౧ చిలుకూరుమహాసభ ౧౩ తీర్మానముప్రకారము ప్రేమయూనియన్ ఆక్టు లెసెన్సిఆక్టు చిత్తుశాసనముల గురించి స్థాయిసంఘమువారికి సూచించుటకు దిగువఉపసంఘము ఏర్పాటుచేయనైనది-వారికి సూచించుటకు దిగువ ఉపసంఘము ఏర్పాటు చేయనైనది.

౧. శ్రీ రావినారాయణరెడ్డిగారు, ౨. బోయినపల్లి వెంకటరామారావుగారు, మందుముల రామచంద్రరావుగారు,

౨. జాగీరుదారుల అధికారములకు సంబంధించిన చిత్తునియమావళిని ఆలోచించి, ఆంధ్రమహాసభయొక్క దృక్పథమునననుసరించి జాగీరు పరిపాలనాచట్టమును ప్రవేశపెట్టుఅవశ్యకతను ప్రభుత్వమువారిదృష్టికి తెచ్చుటకు అవసరమగువిజ్ఞప్తిని సిద్ధపరచి ప్రభుత్వమువారికిపంపించుటకు ఈక్రింది సభ్యులకు సంపూర్ణాధికారమయిచ్చుచు తీర్మానించుచున్నారు:-

౧-శ్రీ రావినారాయణరెడ్డిగారు, ౨.మందుములరామచంద్రరావుగారు, ౩-పి-శ్రీనివాసరెడ్డిగారు. ౪-బి-కేశవరావుగారు.

౩- ఆంధ్రమహాసభ ఉపనియమాలు సిద్ధపరచుటకై దిగువవారిని ఉపసంఘముగా నియమించుచున్నారు:-

౧-శ్రీ రావినారాయణరెడ్డిగారు. ౨ మందుములరామచంద్రరావుగారు, ౩-చిక్కోపల్లి రామచంద్రరావుగారు

౪- తెలంగాణములో ఖద్దరువారము, హరిజనవారము, విద్యావారము, వెట్టిచాకిరివారము, రైతువారములుజరుపుటకై తీర్మానించినారు-(తేదీలు, కార్యక్రమవివరము త్వరలో ప్రకటింపబడును).

౫- గాంధీజయంతిని తెలంగాణములో జరుపుటకు జిల్లాసంఘములవారిని కోరుచు తీర్మానించినారు,

౬- చిలుకూరుమహాసభాతీర్మానము (౧౭వ వి ధములు) సందర్భములో అవసరవ్యవహారమునుజరుపుటకు శ్రీ అధ్యక్షులవారినికోరుచు తీర్మానించినారు-

౭- గద్వాల రైతులనుండి కానుకవిరుద్ధముగా విరాళము వసూలగు పన్నులు ప్రతిసం॥రము నిర్బంధముగా వసూలుచేయుపద్ధతి అతిశయమనియవిని సంస్థానాధికారులకు కోరినను, వారు అధికారికొద్దియంతవరకుప్రత్యుత్తర మివ్వలేదు-కాబట్టి ఈవ్యవహారమునకు సంబంధించిన మొత్తము విషయములనుగూర్చి అధ్యక్షులవారుఅధికారికొద్ది బహిరంగపరచుటకు కోరనైనది-లోగా ఈసంఘపక్షమున బహిరంగపరచిన రిపోర్టును ముఖ్యమగు స్థానికపత్రిక లేదియుప్రకటించనందున, అవసరము గుచో కరపత్రరూపమున ఈ విషయమును ప్రజాబాహుళ్యములో వ్యాప్తిచేయుటకై ఈసభవారు అధ్యక్షులవారిని కోరుచున్నారు.

౮- తెలంగాణ కాలపరిస్థితులను సమగ్రముగా మెమొరాండముద్వారా ప్రభుత్వమువారికి నివేదించి అవసరసహాయమునుఅపేక్షించుటకు తీర్మానించినారు.

### కాశీ విద్యాపీఠానికి రూ ౨½ లక్షల విరాళము

కాశీ విద్యాపీఠముయొక్క రజతోత్సవ సమయానికి దాని ఋణమంతయు తీర్చివేయుటకై అవిద్యాపీఠపు ప్రాతవిద్యార్థులును, ఇప్పటివిద్యార్థులతల్లిదండ్రులు, పోషణకర్తలును విరాళములొసగవలెనని సర్ యస్. రాధాకృష్ణన్ గారు విజ్ఞప్తిచేసినందుకు ఫలితముగా రూ ౨½లక్షలకు ఎక్కువచేకూరినట్లు తెలిసినది-

## అమెరికనునావల సాయుధ మొనరించుట

### ఇప్పుడుకాదని కార్డెల్ హాల్ గారు

వాషింగ్టను, సెప్టెంబరు

జర్మనుయుద్ధనావలు ఎక్కడ చిక్కునో రక్షించుకొనగలుగుటకు వీలుగా అమెరికాసంయుక్త రాష్ట్రముల వర్తకనావలలో ఫిరంగులుంచుట గూర్చి పత్రికాప్రతినిధులుఅడుగగా అమెరికాసంయుక్తరాష్ట్ర విదేశాంగమంత్రియగు కార్డెల్ హాల్ గారు ఇప్పుడట్లుచేయుదలచుటలేదని సెప్టెంబరు ౧౮వ తేదిన చెప్పిరి

# గోలకొండపత్రిక

వృషనామ సం౹౹ ఆశ్వయుజ శు॥ ౧

సోమవారము


## పత్రికలకు సహాయము

సర్ అక్బర్ హైదరీగారు తాము హైద్రాబాదునుండి వెళ్ళు సమయములో హైదరాబాదు వార్తాప్రచారకసంఘము (జర్నలిస్టులసంఘము) వారి ఆతిథ్యమును స్వీకరించి వారిచ్చిన సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరమిచ్చుచూ రెండువిషయాలను ప్రకటించిరి. సంఘానికి ౧౦౦౦ రూ॥ దానమిచ్చుట ఒకటి. రాష్ట్రపత్రికలకు కాగితమును అగ్గువ క్రయముతో సప్లయిచేయించుట రెండవది. అందు మొదటిది అప్పుడే సిద్ధించినదని వినినాము. ఇక రెండవది ఇంతలో సిద్ధింపజేయనున్నారని వినుచున్నాము.

ఇంతవరకు గూడా ఇంచుమించు ఒక సంవత్సరమునుండి ప్రభుత్వమువారు స్థానికపత్రికలకు ఇంతో అంతో కాగితము సహాయము చేయుచునే వచ్చినారు. కాగితాలధర నిరోధము లేకుండా పెరుగుచున్న కాలములో ప్రభుత్వమువారు స్టేషనరీశాఖద్వారా చాలాపెద్దమొత్తములో కాగితాలను తెప్పించి బజారుధరకంటె చాలాతక్కువధరకే పత్రికలవారికిప్పించుచు వచ్చిరి. ఇప్పుడుకూడా బజారుధరకన్న కొంతతక్కువధరకే స్టేషనరీవారినుండి కాగితము లభ్యమగుచున్నది. అయితే ఈసౌకర్యము కొద్దిపాటిది. నూటికి సుమారు ౧౩ పాళ్లతక్కువధరలో దొరుకుటవలన పత్రికాస్థాపకులకు అంతగా లాభము కలుగుట లేదు. అందుచేత ప్రభుత్వమువారు యుద్ధమునకు పూర్వముండినధరయంత రెండంతలధరతో కాగితమును పత్రికాలయాలకియ్యనున్నారు. ఇప్పుడు సర్ హైదరీగారన్నట్లుగా కాగిదంధర యుద్ధమునకు పూర్వముండినదానికన్న అయిదంతలైనది. ప్రభుత్వమువారు అయిదంతలధరకల దానిని రెండంతలధరకే యిచ్చుటలో చాలాగొప్పసహాయము చేసినవారగుదురు. ఈలెక్క చొప్పున కేవలము దినవారపత్రికలకుమాత్రమే సహాయముచేసిన సంవత్సరానికి ౭౦ వేల రూపాయీలవరకు ప్రభుత్వానికి నష్టము కలుగవచ్చును. ఇతర మాసాదిపత్రికలకును సహాయము చేసిన మరొక ౧౦ వేల నష్టము కావచ్చును: ఇంత నష్టమునుభరించి పత్రికలకు సాయము చేయుచున్నారనినచో రాష్ట్రపత్రికాప్రచారకులందరును ప్రభుత్వానికి చాలా కృతజ్ఞతాబద్ధులై యుండగలరు.

పత్రికలకు ప్రభుత్వసహాయము ఉండ గూడదను మూలసిద్ధాంతవాదులమైనను ఈయుద్ధకాలములో ప్రత్యేకపరిస్థితుల నుచూచిన పైసిద్ధాంతమును ప్రక్కకుబెట్టి ప్రభుత్వాన్ని "భవతీ భిక్షాం దేహి" అని అనకతప్పదు. ప్రభుత్వమువారి ఔదార్యాన్ని మేముమనసార ప్రశంసించుచున్నాము.

---

## సిరిసిల్ల తాలూకాలో ఘోరహత్యలు

(స్వ-వి-) సిరిసిల్ల, ౧౨-౧౨-౫౦ ఫ-

౫వ ఆబాను నాడు కరీంనగరం తాలూకాలోని సారిపెల్లి నివాసస్థులగు ఇద్దరురైతులు (బుధవారం ౫-౧౨-౫౦ ఫ నాడు) రెండుజాములకు బయలుదేరి రాళ్ళపేట (తా॥ సిరిసిల్ల)కు సాయంత్రమువరకుచేరిరి- సూర్యాస్తమయసమయమున మానేరునదిదాటి సరుదాపురము (తా॥ సిరిసిల్ల)గద్దకు ఎక్కుచుండిరి ఎనముందుగురు పిచ్చుకుంట్లవాండ్లు ఈఇద్దరిరైతులను హత్యచేసి వారివద్దనున్న బియ్యము, రూపాయలు, కడియాలు, చొక్కాలు, బట్టలుతీసుకొని చంపినపీనుగలను, సర్దాపురముకల్లు దుకాణములో భద్రముగానుంచి కంబళ్ళుకప్పి వెళ్ళిపోయిరి- వాళ్లుగూడ ఈఘోరహత్యనుచూచి సాహిత్యము చే గ్రామములోనికి పారిపోయిరి- పోలీసు పట్వారితో ఈసంగతి తెలిపిరట ఈ ఎనమందుగురు పిచ్చుకుంట్లవాండ్లు బాగుగాతిప్పి త్రాగియుండిరట. వారిచెంతనున్న బియ్యము, సామానులాగుకొనిరందులకై ఇరువురిరైతులను చంపిరి.

ఈఇద్దరు రైతులు, వారిఅవులు బలిజేపల్లి (మహానూర)లో మేయుటకై పోయియుండుటచే వాటికాపరులకుబత్తెము చిల్లరఖర్చు తీసుకపోవుచుండిరి.

పిచ్చుకుంట్లవాండ్లు అరెస్టుఅయినారు. వాళ్ళవద్దబియ్యము, రూపాయలు, కడియాలు, బట్టలు (చచ్చినవాండ్లవి)దొరికినవి, పోలీసువాండ్లు చంపినచోటు నిర్ణయముచేసినారు. పిచ్చుకుంట్లవాండ్లు చంపినామని ఒప్పుకొనుచున్నారు. వివరములు ముందువిపులముగా తెలుపబడును.

---

### పాల్వంచలో కరువుసూచనలు

(ఓ-వి)

వరంగల్లుజిల్లా పాల్వంచతాలూకాలోని మల్లూరు, మంగపేటప్రాంతము చాలాఅడవియు గుట్టలు విరివిగావుండు ప్రదేశము యిచ్చట కొన్ని ప్రదేశములలో తాగుటకునీరుకూడలేదు- ఇప్పటికి ప్రస్తావనపైరులు రు ౧కి ౦౻౭ల వంతుఎండిపోయినవి- వరిపొలములు ఇంతవరకు చావలేదు. కాని ముందుపండుననుఆశలేదు ఇంకవరకు కుంటలకు నీరురాలేదు-బీదలకుతినుటకు అన్నముదొరుకుటలేదు-ఉన్నధనవంతులు బీదలకు డబ్బుతెచ్చినను వావ్యంయిచ్చుటలేదు- కొన్నిప్రదేశములలో కలరాజాడ్యమువల్ల జనులుచచ్చుచున్నారు-

---

### సూర్యాపేటతాలూకాలోవర్షము

(స్వ-వి) ౧౪-౯-౧౯౪-

సూర్యాపేటతాలూకాలో అచ్చటచ్చట వర్షముకురిసినది. దీనివలన బీదకర్షక, కార్మికులు మిగులఉత్సాహముతో తమతమపనులలో నిమగ్నులైనందున దోపిడిపద్ధతులడుగంటినవి. ఐనప్పటికి కొన్నిచోట్లవర్షములులేవని తెలియుచున్నది అందుకు చెరువులుకుంటలు నిండకతప్పదు. ఐనప్పటికి సజ్జపంట చెడిపోయినదనే చెప్పవచ్చు. ఏమైననొన్న మొదలగునవి ఈవర్షముచే వేసినపైరులు మాత్రమే ఫలించును.

### ఆర్యసమాజ పండితుల ఉపన్యాసాలు

సూర్యాపేట, ౬-౧౨-౫౦ఫ.

మొన్నటిదినము మధ్యాహ్నము అఖిలభారత ప్రఖ్యాతిగ్లినట్టియు, ఆర్యసమాజవక్తలలో ప్రముఖులునుఅగుపండిత బుద్ధదేవు, శాస్త్రార్థిమహారథి (పంజాబు)గారున్నూ ఢిల్లీప్రతినిధిసభాప్రచారకులగు పండిత మనోహరుగారున్నూ యిచ్చటికి దయచేసిరి.

ఆసాయంత్రమే ఆర్యసమాజభవనమున "మానసికప్రవృత్తి"నిగురించి శ్రీమనోహరలాలుగారుపన్యసించిరి.

గతరాత్రి శ్రీబుద్ధదేవుగారి ఉపన్యాసముజరిగెను. శ్రీవారు "మనముఆర్యసామాజికుల మేలగావలెను?" అనుఅంశముమీద షుమారు౩గంటలకాలముదీర్ఘోపన్యాసము గావించిరి, తాముచెప్పు ప్రతివిషయమునకును, వేద-పురాణ-కావ్యాను అన్నింటినుండి ప్రమాణములనుఎత్తిజూపుచూ, తులసీరామాయణకీర్తనల, మధ్యమధ్య రాగయుక్తముగా శాలాపించుచూ వారుసభాసదుల ముగ్ధులగావించిరి.

ఉపన్యాసానంతరము సనాతనధర్మపరులు కొందరు పండితులనుప్రశ్నలడుగగా వారు సంతృప్తికరముగా జవాబిచ్చిరి.

సూర్యాపేట ఆర్యసమాజమంత్రులగు శ్రీ శంకటనర్సయ్యగారి అభినందనములతో సభముగిసెను- ఆర్యకుమారదళసభ్యులు నల్లగొండపోవుచున్న పండితులకు గ్రామసంకీర్తనముచేసినతదుపరి వీడ్కోలునిచ్చిరి.

---

### భువనగిరి తాలూకాలో క్షామము

భువనగిరి. ౪-౧౧-౫౦ఫ.

ఇదియు భాద్రపదమాసబహుళపక్షమే అయినను గతించినభాద్రపదమునకును ప్రస్తుతభాద్రపదమునకును భూమ్యాకాశ వ్యత్యాసమున్నది.

భువనగిరితాలూకాలో ఈసంవత్సరము మృగశిరపెల్లిఆర్ద్రకార్తి మొదటిపాదంలో ఒకటి రెండు స్వల్పవర్షములుకురిసినందున గతసంవత్సరము వ విశేషముగా కాలమునడిపించునని తలంచి పునాసప్రైర్లన్నియు శేగిరపాటుతో ఉడుకుమక్కులలోవేసిరి. బావులలోదారంకలనాయ మాగాణికొరకు నార్లుపోసుకొనిరి- నేటివరకును కొన్నిచోట్లబిందుపతనమైననుకాలేదు. కొన్నిచోట్లఆశ్లేషకార్తిధనిష్ఠలో చిన్నముసురుకురిసి వర్షములు కురిసినందున రేగళ్లు మొదలగు వల్లభూములు పూర్తిగా ఆదిరి రొండిపోయినవి-పశువులకు మేతలేనందున కొన్నిఎండినచేనుభాగములలో పశువులను మేపవలసివచ్చినది-కంచెలలో గడ్డిలేదు-వరిగడ్డి బొత్తిగాలేదు-ఆముదపుచేలు చాలా భాగం విషకీటకములకాహుతియైపోవుచున్నవి. సజ్జలు మొదలగుధాన్యముచల్లిన గుర్తులుకూడాలేవు పశువులకు త్రాగనీరులేదు, తినుటకు మేతలేదు-నూటికి అరవయిభాగములపశువులను తూర్పువైపు తోలుకొనిపోయిరి-చెరువులలో నీరుఏమాత్రములేదు-బావులలోనీరులేదు-పాతబావులలో పూడికలుతీయించినను ఏవిధమగునీటి ఆధారముగోచరింపదు కొన్నిచోట్లలోపశువులు బలహీనమయినందున మనుష్యులేమోటలాగి పైర్లుపోసినారు- రైతులకేమాత్రం పనులులేవు- ఉదయము మొదలు అస్తమయమువరకు గ్రామ పటేలుపట్వారీల ఇండ్లముందర గుంపులుగుంపులుగాకూర్చుండి తమతిండి కాధారము ననుగల్పింపవలసినదని కోరుచు తుదకు విఫలమనోరథులై గృహములుచేరి పరుండుచున్నారు- కొందరుకూలిపనివాండ్లు ఈతతాడిచెట్లగూడాతో కాలముగడుపుచున్నారు- ఒకొక్కరైతు రెండుమూడుదివసములకొకపూట భోజనముచేసిజీవించుచున్నాడు.

### వస్తాకొండూరు రైతులు

ఈతాలూకా సరిహద్దుగ్రామమైన వస్తాకొండూరుగ్రామధనికులు కొందరు ఈమధ్య ధాన్యపుధరలుపెరిగినందున సంతసించి తమతమ ధాన్యము ననువిక్రయించుటకు జనగామకు సుమారు౫౦బండ్లనింపుకొనిపోవుచుండగా గ్రామరైతులందరు బండ్లకడ్డముగా ఒకదివసమంతయు నిరాహారవ్రతమునుబూనిపరుండిరి. అటుపయినవారు ఏమియుచేయజాలక సుమారు ౪ పుట్లధాన్యము గ్రామస్థులకు బాకుగాఇచ్చిరి-

నల్లగొండలో తకావీరూపాయీలకు బదులుగా సర్కారువారు పశువులకు గడ్డి సప్లయిచేస్తున్నారట- అట్టిపొంగుముల్లు గడ్డికొరకు ఒకరూపాయకొర్పి పొందులలెక్కచొప్పున తెచ్చిన పశువులకు సకాలముగా నుండకపోవుటయేగాక రైతులుఋణముల పాలగుచు-ఇంతకుమొదలే పోయిన కాళయుక్తిసంవత్సరపు సమయమందు పైఅధికారులు (౫౦)రూపాయీలు రైతుగిక తకావీ మంజారిచేయగా అయిదుఆరుమారులు తిరిగి తుదకు క్రిందిపేగేవాళ్లు మామూళ్లుమొదలగునవి పోగా (౫)రూపాయలకు బదులు (౩౫) రూపాయలు ఇండ్లకుతెచ్చుకొనుటముజరిగినది- అట్టిఋణములు యింతవరకు చాలామందివితీరలేదు-అట్టి(౩౫)రూపాయలకుబదులు నేడు (౪౫) రూపాయలుఅయినవి.

---

### హత్యాభియోగములో శిక్ష

ఔరంగాబాదు సెషన్సు న్యాయస్థానములో కొన్నినెలలనుండి జరుగుచున్న ఒక హత్యాభియోగములో ౧౭ సెప్టెంబరునాడు ౫గురు రోహిలాలపై నేరము ధ్రువపరచబడి యావజ్జీవకారాగారవాసశిక్ష విధించబడినది- నిందితులలో ఇద్దరు పారిపోయియున్నారు- నిదితులందరును అయిదుగురు రైతులను తుపాకులతో కాల్చిచంపిరని వారలపై తేబడిన ఫిర్యాదు అయి ఉన్నది-

ప్రభుత్వమువారితరపున ఆడ్వొకేటు (హైద్రాబాదు దక్కను), మరియు పండితరావు, బి-ఏ. ఎల్ ఎల్-బి- గారలును నిందితులపక్షమున మీర్జా రహీంబేగు, అప్సర్ అలీ గారలును వాదించిరి-

---

### రెండుహత్యలు

పర్భణిజిల్లాలోని అజగాంగ్రామంలో ఇద్దరురైతులను, ఒకరోహిలాచంపినట్లు ౧౭ సెప్టెంబరునాటి నేషనల్ న్యూస్ సర్వీస్ వార్త ముషీర్ పత్రికలో ప్రకటించబడినది-పోలీసులు పరిశోధనచేయుచున్నారు.

---

### క్రొత్తపరిశ్రమ ప్రారంభయత్నము

#### మహబూబునగరంజిల్లా వర్తకసంఘము వారి సూచనలు

(విశేషరి) ౧౦-౧౨-౧౩౫౦ఫ

పైతేదీన మహబూబునగరంజిల్లావర్తక సంఘముయొక్క కార్యనిర్వాహకసభజరుగును. ఈ క్రిందితీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను:

హైదరాబాదు(దక్కను) నగరమందలి కేంద్రవర్తకసంఘముయొక్క తేది ౩-ఆబాను ౧౩౫౦ ఫ. నాటి కార్యనిర్వాహకసభలో తీర్మానించిన తీర్మానమును ఈజిల్లావర్తకసంఘములపరముచు, ప్రధానమంత్రిగారికి చేసినవిజ్ఞాపనఏమనగా, ఈతీర్మానముపైతగుశ్రద్ధగైకొనవలెను, ఈలాటివిషయములు ముందుకురావడములో సాహుకార్లకేగాక ప్రభుత్వమునకుగూడ నష్టముగాకుండచేయగలరని కోరుచున్నారు.

ఈజిల్లావర్తకసంఘమునకు గౌరవనీయుల ద్వారా తెలిసినవిషయమేమనగా హైద్రాబాదు రాష్ట్రపు ఒకవర్తకుడు ౧౦-౧౨-౫౦ పరిశ్రమస్థాపన తనకుయివ్వమని ప్రభుత్వమువారిని కోరినాడు. మొదట చేతిపనులకర్మాగారములకు తగిన అయిదుకోట్లద్రవ్యమునకుగాను రెండుకోట్లసర్నప్రభుత్వముయివ్వవలెననికోరినాడు పైవిషయమునుండి స్థానికవ్యాపారాలు, కర్మాగారాలు ఉండే పరిశ్రమలనిధినికూర్చినచోట్ల అందోళన కలిగించినది. ప్రభుత్వముయొక్క ఈఉద్దేశముతో ఏకీభవించుచు మన హైద్రాబాదురాష్ట్రములోని లాభము గానడిచే పనులకే కర్మాగారములను కొంతకాలమువరకు అవసరములగు సహాయములుచేసి కాపాడవలయునని మరియుకావలసినరొండల వాండ్లకుతగుద్రవ్యసహాయము యివ్వగలరు. కాని ఈసంఘముయొక్క ఉద్దేశమేమనగా రాష్ట్రముయొక్కవర్తకులకు సాహుకార్లకు లాభకారులైన చేతిపనులలో కర్మాగారాలలోని అభివృద్ధితెచ్చువిషయమును మనుగుడయించుటకును మరియుఅందరికిసమమయిన లాభముచేకూరుటకును ఏఒకవ్యక్తికిగాని పదిముఖ్యమైన కర్మాగారములు మనాపలీగాయివ్వకూడదు. ఒకవేళ ప్రజలురేంద్రైన లాభముండేచేతిపనుల కర్మాగారాలలో ద్రవ్యముపెట్టుటలో సంకోచపడినరొండల ప్రభుత్వమువారే సహాయముచేయవలెను.

---

## జిన్నా గారిపై హక్కు గారి ఆగ్రహము

తనవవమానించదలచినవారలకు హక్కుగారి బెదరింపు

బెంగాలు ప్రధాని ఫజ్లుల్ హక్ గారు తుదకు దేశరక్షణసంఘమునుండి రాజీనామా నిచ్చినారు గాని శాంతముగా ఇవ్వలేదు. రాజీనామా లేఖలో జిన్నా గారివ్యవహారధోరణిపై మండిపడినారు "అఖిలభారతముస్లింలీగు అధ్యక్షునకివ్వబడియున్న అధికారములు న్యాయమునీతిలేక ఇష్టమువచ్చినట్లు చెలాయింపబడుచున్నది. అందుకై నా ఆగ్రహమునుసూచించుటకుగాను నేను అఖిలభారత ముస్లింలీగుయొక్క కౌన్సిలునుండియు కార్యవర్గమునుండియు రాజీనామా నిచ్చుచున్నాను అని హక్ గారు లీగుకార్యదర్శి గారికి పంపినలేఖలో వ్రాసినారు. అఖిలభారతముస్లింలీగులో ప్రజాస్వామ్యసిద్ధాంతములును, భాగస్వాముల స్వాతంత్ర్యములును ఒక్క నియంతయొక్క ఇష్టానిష్టములకు లోబడునట్లు చేయబడినవి, భారతీయ ముసల్మాను రాజకీయములలో బెంగాలురాష్ట్రముసల్మానులదిలెక్కస్థానము వారు మూడుకోట్ల ముప్పదిలక్షలమంది యున్నారు. వారందరిపైనను జిన్నా గారు సర్వాధికారము చెలాయించజూచుచున్నారు అని హక్కుగారు ఆక్షేపించినారు.

ఇంతఆక్షేపించినతర్వాత దేశరక్షణసమితినుండి తామురాజీనామాగియ్యవలసిన న్యాయముకనిపించుటలేకున్నను, తక్కిన ప్రధానులందరును అసమితినుండి రాజీనామానిచ్చియుండుటవల్ల, తాకొక్కడ నేయుండి లాభములేదని తోచినందువల్ల రాజీనామానిచ్చుచుంటినని హక్కుగారు తెలిపినారు—కానింకను రాజీనామా నీయకుండావున్నచో ముస్లింసంఘములోనే రెండు భాగాలుఏర్పడి చీలికఅగు తానవకాశమిచ్చినవాడ నగుదుననియు, అట్టిదితనకిష్టములేదనియు, అందుకై రాజీనామానిచ్చుటయే అవసరమనితలచితిననియు హక్కుగారు ముస్లింలీగుకార్యదర్శి గారికి వ్రాసినలేఖలో వ్రాసినారు.

ఈ రాజీనామాలేఖపై జిన్నా గారువిమర్శించుచు, ముస్లింలీగుకార్యవర్గమువారుప్రస్తుతపరిస్థితిలో లీగుప్రతిష్ఠనిలుపుటకుమరొకవిధమునతీర్మానము చేసియుండజాలదనియు, అసంగతిని హక్కుగారే ఆగ్రహముతగ్గి శాంతపడి ఆలోచించినపుడు గ్రహించి పశ్చాత్తాపపడగలరనియు సమాధానమొసగినారు.

సెప్టెంబరు ౧౭ వతేదిరాత్రి హక్కుగారు మరొకప్రకటనచేయుచు తన ప్రకటన చేయబడిన దో లేదో అప్పుడే విద్యార్థులొకరహస్యసమావేశముచేసి అవమానప్రదర్శనము చేయుటకును, సన్మోజనుపుటకు ఆలోచించినట్లు తనకు తెలిసినదనియు, సెప్టెంబరు ౧౧ వ తేదిన సాయంకాలంవిద్యార్థులుకొందరు నడిపించిన ఒకవిద్యాసంస్థలోనివారలు తనయింటికివచ్చి అవమానప్రదర్శనముచేయజూచి విఫలులైపోయిరనియు, సెప్టెంబరు ౧౭వతేదిన కలకత్తాలోనివంగేతరముసల్మానులుకొందరు నల్లబెండాలప్రదర్శనమొకదానిని చేయబోవుచున్నట్లు తెలిసినదనియు, కలకత్తాలో బెంగాలీయులుకాని ముసల్మానులు పదిలక్షలమందికంటె అధికముగానున్నారుకాబట్టి వారికిష్టమైనప్రదర్శనమొకదానిని జరుపుటవారలకుకష్టముకాదనియు, కాని అప్రదర్శనములో బెంగాలీయ ముసల్మానులెవరుగాని పాల్గొనరని తనకువిశ్వాసముగలదనియు, బెంగాలీయేతర ముసల్మానులెవరుగాని పెంకితనముతో నట్టిప్రదర్శనములను జరిపినట్లైనతరువాత జరుగబోవుచర్యలకన్నిటికిని వారలేబాధ్యులై యుండగలరనియు హెచ్చరికచేసినారు, బెంగాలీయులుకాని ముసల్మానులలోకూడ తనపైఅభిమానములేక చదువురాని బెంగాలీయేతర ముసల్మానులనురెచ్చగొట్టి ఆక్రమరాజకీయాలలోకి దించేటట్టివారిందరికే తనహెచ్చరికవర్తించునని హక్కుగారుతుదకు చెప్పినారు,

... ... ...

హక్కుగారవలంబించినచర్యవల్ల బెంగాలు రాష్ట్రముస్లింలీగును అఖిలభారతముస్లింలీగు కార్యకర్తలపైనను జిన్నా గారిపైనను విశ్వాసముతొలగినదని భావింపబడునేమోయనుభయముతో బెంగాలురాష్ట్ర ముస్లింలీగుకార్యకర్తలసంఘము సెప్టెంబరు ౧౭ వతేదిన అత్యవసరముగ సమావేశమై దేశరక్షణసంఘమునిర్మాణ విషయములో తాముఅఖిలభారతముస్లింలీగు కార్యకర్తల సంఘముయొక్క అభిప్రాయముతో ఏకీభవించుచున్నామని తీర్మానించిరి. జిన్నా గారిలో పూర్ణవిశ్వాసముగలదనిరి, సమావేశమునకు హక్కుగారుపోలేదు.

---

## గోలకొండగ్రంథాలయము

రామోపాఖ్యానము

కర్త శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఉత్తమ ౧౮౦ పుటల విమర్శనము, ౯౦ పుటల ఎఱ్ఱాప్రగడ కవికృతరామోపాఖ్యానము గలదు, వెల రూ ౧ ౪-౦, దొరకుచోటు, శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పిఠాపురం తూర్పుగోదావరిజిల్లా.

ఇది భారతాంతర్గతమై ఎఱ్ఱాప్రగడ రచితమైన రామాయణకథ శాస్త్రిగారు ఎఱ్ఱకవిగారి మూలమును ముద్రించుచు దానికి కొంతటీక వ్రాసినారు పైగా ఒకవిపులమగు పీఠిక వ్రాసినారు. మూలపద్యభాగముకన్న పీఠికయే పెద్దదిగానున్నది. అదియే యిందలివిశేషత. ఎఱ్ఱనకవితాప్రాశస్త్యమును సకారణంగా తెలుసుకోదలచిన ఈపీఠికను చదువవలెను,

శ్రీరామునిముచ్చట ఋగ్వేదములో నున్నదని శాస్త్రిగా రొకఋక్కు నుదహరించినారు—ఆంధ్రములో నిట్టియుదాహరణము ఇదేమొదటిపర్యాయమని అనుకొనుచున్నాము. (ఉదాహృతమంత్రము మూడచ్చుతప్పులతోనున్నది) పీఠికాభాగములో ఇదివరకు ఎందును ముద్రితముకాని ఇంద్రవర్మశాసనమును శాస్త్రిగారు సంపాదించి ముద్రించినారు. ఇదిచారిత్రికపరిశోధకులకుచాలా విలువకలది. ఇందలి ప్రాచీనపదాలుకొన్ని అర్థముకానివైయున్నవని శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారును ఒప్పుకొన్నారు. శాసనప్రాముఖ్యతనుబట్టియు భాషాప్రాముఖ్యతనుబట్టియు తెనుగుపండితులాపదాలచిక్కును విడదీయుటకు ప్రయత్నింతురుగాక. మేమును కొంత ప్రయత్నించుచున్నాము. శాస్త్రిగారు దురవగాహమన్నపదాలలో "అల్లపాకబోళ్"అనుదానిలో బోళ్ అనగా ప్రోలుకావున అపదము అల్లపాకప్రోలుఅగును. సెప్పిలాల్ అట్టిదే "సెప్పిలాల"అగును (వావిలాలఅనుపదమువలె) ప్రాల్మాంకల్ అనునది ప్రాలమాకుల అగును. (మాకులఅనగా మ్రాకులచెట్లుగల) మాకుల అనిఅంతముగల గ్రామనామాలు గద్వాలలోను మహబూబునగరుజిల్లాలోను ఇప్పటికిని కలవు. చోడబోళ్ అనగా చోళప్రోలు బోయ శబ్దమునకు బ్రాహ్మణుడుఅని హైదరాబాదు రాష్ట్రములో వ్యవహారములోకలదని మాకుతెలిసినంతవరకుచెప్పగలము. అదిభోజశబ్దభవము, కొన్ని యితరశాసనములలో "భోజ—బోయ" శబ్దములు ప్రయుక్తమైనట్లు మాజ్ఞాపకం.

శాస్త్రిగారిపీఠిక మంచిపరిశోధనతోను నూతనవిషయాలతోను విజ్ఞానప్రదమగు వంశాలతోను కూడినది ఈగ్రంథము పాఠగ్రంథముగా బళ్లలో ఏర్పాటుచేయుటకు చాలాతగియున్నది.

---

## దేవీప్రశ్న

అయిదుప్రశ్నలువ్రాసి కవరులోయుంచి సీలువేసిపంపిన దేవీమహిమచే ఫలితములువ్రాసి మీకే కవరుసహా పంపుటకు రు 1_6_0 సంవత్సరఫలం సోమవారీ రు 1_12_0 దశలుగల పూర్ణజాతకం రు5_8_0 శ్రీసరస్వతీజ్యోతిషాలయం, కాకినాడ.

## అ. భా. చ ర ఖా సం ఘం

# యుద్ధానికి కంబళ్లు అమ్మవచ్చునా?

గాంధిమహాత్ముని భావము వివరణము

లాహోరు, సెప్టెంబరు ౧౬

సింధురాష్ట్రము నందలి అఖిలభారతచరఖా సంఘశాఖలు కొన్ని సైనికుల ఉపయోగమునకై కంబళ్లు చేయుట కంగీకరించియుండెను—కాంగ్రెసులో నంతర్భాగమగు సంస్థలు యిట్లు చేయుట యుక్తమాయని లాహోరు కాంగ్రెసువాదియగు శ్రీపురాణచందుగారు ప్రశ్నింపగా మహాత్ముని పక్షమున శ్రీ—ఎల్—మష్రూవాలాగారు ప్రత్యుత్తరమొసంగుచు ప్రభుత్వమువారితో కాంగ్రెసువారలు సర్దకవ్యాపారములు చేయువిషయమై భారతజాతీయమహాసభయొక్క పద్ధతిని వివరించినారు.

శ్రీమష్రూవాలాగారి ఉత్తర మీవిధముగా నున్నది:—

"సైనికులఉపయోగమునకై ప్రభుత్వమువారికి కంబళ్లు చేసిపెట్టుటకు సింధురాష్ట్ర అ.భా.చరఖా సంఘము అంగీకరించియుండినమాట వాస్తవమే. గాంధిమహాత్ముని ఎరుకతోను, సంపూర్ణాంగీకారముతోను ఇట్లు చేయబడెను—సంఘమువా ఇట్లుచేయుట సత్యాగ్రహోద్యమ సూత్రముల కనుగుణమా యని ప్రశ్నించినవారు మీరొక్క రేకాదు—ఇందువిషయమై మీరు సమాధానము కోరుట యుక్తమే.

### ఇప్పటి సత్యాగ్రహపు హద్దులు

"ఈవిషయమును అర్థము చేసుకొనవలెననిన, ప్రస్తుతసత్యాగ్రహము యొక్క హద్దులను బాగుగా గ్రహింపవలసియుండును— స్వాతంత్ర్యము రానంతవరకు యుద్ధమునకు సంపూర్ణముగా సహాయనిరాకరించుట సాధ్యముకాదు— టపాబిళ్లలు కొన్నప్పుడును, రైలుమీద ప్రయాణముచేయునప్పుడును, పెట్రోలు లేక నిప్పుపెట్టెలు కొన్నప్పుడు ను మనము,మనకిష్టమున్నను లేకపోయినను,యుద్ధమునకు తోడ్పడుచు నేయున్నారు—నిర్బంధముగా థీమా చేయించుకొనవలసి వచ్చుచుకూడ మనము యుద్ధమునకుతోడ్పడుచున్నాము—ఈపరోక్ష సహాయము మనకుతప్పుటలేదు—ప్రభుత్వమునకు తిరుగుబాటుచేసి ఎదిరించుటకునిశ్చయించినప్పుడే యిది సాధ్యమగును—కాని ప్రస్తుతోద్యమముయొక్క ఉద్దేశ్యమిది గాదు.

"ఇష్టముతో యుద్ధమునకు యెట్టిసహాయము చేయకలదని ప్రజలకుసలహాయిచ్చువాక్కును ప్రకటించుటమాత్రమే ప్రస్తుత సత్యాగ్రహోద్యమముయొక్క ఉద్దేశ్యము_యుద్ధములో సైనికులుగా చేరియు. యుద్ధనిధులకుద్రవ్యమొసంగియు. యుద్ధఋణములకుద్రవ్యమొసంగియు ప్రజలు ఇష్టముతో యుద్ధమునకు తోడ్పడుచున్నారు— ఇట్టివానిలోసైతము, సలహానిచ్చుటమాత్రమే కాంగ్రెసు ఉద్దేశ్యము— పికెట్టుచేయుటగాని యుద్ధమునకుఅనుకూలురుగానున్నవారు చేయుసభలలో అల్లరిచేయుటగాని మనసంకల్పముకాదు— యుద్ధము విషయమై మన అభిప్రాయము తెలుపుటకు మనకు స్వాతంత్ర్యముకలదని ప్రకటించుటయే మన ఆశయము,

### ప్రభుత్వము వారితో వ్యాపారము

"ప్రభుత్వమువారితో వ్యాపారము చేయుట చందాలిచ్చుటవంటిదికాదు—అవి క్రయవిక్రయములు—ఇంకొకవిధముగా చెప్పవలయునన్న—మీరు కాగితపువర్తకు లనుకొందురు! మీదగ్గరకాగితముకొనువారు ప్రభుత్వమువారైనను వారుఈకాగితము నేమిచేయుదురు! సాధారణ వాఙ్మయమును ముద్రింతురా? లేక యుద్ధమునకు సంబంధించిన వాఙ్మయమును ముద్రింతురా యని మీరువిచారించుచుందురా! సాధారణసమయములలో కాగితము పౌరుల ఉపయోగమునకు పనికి వచ్చునదైయున్నది_ ఈవిధముగానే గోధుమలు, కంబళ్లు మున్నగునవి—మీ ఈ తుపాకులమరయాదు లే మువారగుచో భేదముండును_ తుపాకులకు యుద్ధములోతప్ప వేరుఉపయోగము లేదు—

"ద్రవ్యముతప్పకొని ఒక వస్తువును మీరు అమ్మచో కొనువారికి మీరు చేసిన దాక్షిణ్యము యేమియులేదు— చందాయిచ్చినను, ఋణమిచ్చినను మీరు దాక్షిణ్యము చూపుచున్నారు.

"ఇంకొకవిషయము జ్ఞాపక ముంచుకొనవలసినది—ప్రభుత్వమువారిని చిక్కులుపెట్టుటకు యీ ఉద్యమము ప్రారంభింపలేదని స్పష్టముచేయబడియుండెను— మీరువర్తకులై. అమ్మకమునకుగాను వస్తువులు ఉత్పత్తిచేయువారనుకొందము. ఒకానొకనికి ఈవస్తువులుచాలఅవసరమని మీకు తెలియును—అతడుమీవస్తువులకు తగినధర యివ్వగలడు. ఈతనికినిమీకును యేమో భేదాభిప్రాయములున్న కారణముచేత మీరు మీవస్తువుల నతనికిఅమ్ముటకు నిరాకరించుచో అతనినిచిక్కులుపెట్ట నుద్దేశించినవారుకారా? ప్రస్తుత సత్యాగ్రహముయొక్క ఉద్దేశ్యముమాత్రమిదిగాదని యిదివరకు అనేకసారులు తెలుపబడియుండెను

"ప్రస్తుతసత్యాగ్రహము పరిమితవ్యాప్తి కలిగియున్నది, కనుక, గాంధిగారుచెప్పు దౌర్జన్యరాహిత్యకారణములవల్లను కాంగ్రెసువారి రాజకీయ అసంతృప్తి కారణమువల్లను యుద్ధములో మనము ప్రమేయము కలిగించుకొనకుండుటయు మనదేశములకుపయోగార్థము వస్తువులను సరసమైనధరలకు అమ్ముటకును విరోధములేదని మీకిప్పుడు స్పష్టమగునని తలచుచున్నాను.

"ఇంకను మీకు సంశయములున్నచో అడుగవచ్చును— సంశయములన్నియు తొలగినయెడల ఈఉత్తరమును యితరులకు చూపవచ్చును."

### పురాణచందుగారి సంతృప్తి

పైలేఖను పత్రికలకువిడుదలచేయుచు పురాణచందుగారు ఒకప్రకటన గావించుచున్నారు— శ్రీమష్రూవాలాగారొసంగిన ప్రత్యుత్తరము తనకు సంశయనివృత్తిని గావించెనని ఆయన తెలుపుచున్నాడు—వినను, సత్యాగ్రహుల సంశయములను, ప్రజలసంశయములను తీరుతీరుగాతొలగించుటకు వీలుకానందున తానులేఖను పత్రికలకుపంపుచున్నట్లు ఆయనచెప్పుచున్నాడు,

---

### బర్మాశాసనసభ్యుని అరెస్టు

బర్మా శాసనసభ్యుడును, రంగూను కార్పొరేషనుసభ్యుడునగు యు. బి, ప్లాయింగుగారిని బర్మాదేశరక్షణ నియమాలక్రింద సెప్టెంబరు ౧౬వ తేదిన అరెస్టుచేసినారు.

---









## మ. హ. వ. నిజాం స్టేట్ రైల్వే.

### నోటీసు.

ఈరైల్వేలోని జానకంపేట_బోధన్ సెక్షన్‌లో జానకంపేట జంక్షన్, ఆలీసాగర్ల మధ్యనున్న జానకంపేటరోడ్డు స్టేషన్ 1వ అక్టోబరునుండి ప్రయాణీకుల రాకపోకలకును, సరకు ఎగుమతి దిగుమతులకున్ను ఈరైల్వేహద్దులవరకుమాత్రమే తెరువబడును.

సికింద్రాబాదు, 18-9-1941,    (బై ఆర్డర్)

౧ సంవత్సరము చందా
౬ రూపాయిలు
౬ నెలలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సంవత్సరచందా
౫-౮-౦ కల్దారు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

THE ONLY POPULAR PAPER THAT REACHES The masses In the Dominions BEST MEDIUM for Advertisement.

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday 22nd September 1941 | Number 40

## నల్లగొండజిల్లా కరువునివారణ

క్షామబాధితులకు ప్రభుత్వసహాయము

నల్లగొండజిల్లాలో అనావృష్టిబాధితులకు రైతులకుతక్కావిలిచ్చుటకైను-నుం-నిజాం ప్రభుత్వమువారు రూ ౫౦౦౦౦లు మంజూరుచేసినారు-పశువుల మేతకై రూ ౨౦౦౦౦లు మంజూరుచేసినారు- జిల్లాలో అక్కడక్కడ నిలవచేసినకేంద్రములనుపెట్టి, అవసరమైగ్రామాలకు అకేంద్రమునుండి అమేతనుమోటారులలో తీసుకొనిపోయి న్యాయమైనధరలకు అమ్ముటకు ఏర్పాటుచేసినారు-శయవృత్తులుగా లోకల్ఫండుబల్లకు భవనము కట్టించుటకై రు ౨౬౬౦౦౦లు మంజూరుచేయబడినవి.

## దసరాలో ఆయుధధారణ కనుమతికోరుట

ఆయుధధారణను నిషేధించుటజ్ఞను దసరాలో తొలగించినచో హిందువులకు సంతృప్తికరముగా నుండగలదని హిందూప్రజామండలి కార్యదర్శియగు యశ్వంతరావు జోషిగారు ప్రధానమంత్రిగారికిని మరికొందరు, న్యాయశాఖమంత్రిగారికిని ఒక విజ్ఞప్తిని పంపుకొన్నారు.

## ఉస్మానియా విద్యాపీఠభవనములు-ప్రధానిగారి సందర్శనము

ఈఆక్టోబరు ౧ తేదిన ప్రధానమంత్రి ఛతారి నవాబుగారు ఉస్మానియా విద్యాపీఠభవనములను చూచిరి-వారికక్కడ ప్రొఫెసర్లు స్వాగతమిచ్చి అన్ని భాగములను చూపిరి-ఛతారినవాబుగారు ఒకచిన్న ఉపన్యాసముచేయుచు ఆ భవనములయందలి ప్రతియొకటియు భారతదేశముయొక్క ఘనత చిలికలలోకేదు, ఏకమత్యములోనే యున్నదని చాటుచున్నట్లుగా లక్షణములను గలిగియున్నదనిరి.

## నైజాంస్టేట్ రైల్వే వర్తకులకు మనవి.

ఇప్పుడు కొందరువర్తకులు తమకేరవచ్చిన సరకులను వెంటవెంటనే తీసికొనిపోక ఆలస్యము చేయుచున్నారు-అట్టిసరకులు వర్షమునకు చెమ్మకుచెడిపోవునైనచో వాటినిదింపవీలులేనందువల్ల రైలుడబ్బాలలోనే ఉంచవలసి వచ్చుచున్నది. మరికొందరు ఆ నేకదినములవరకు సామానుశాలలో దింపించిపెట్టిన సరకులను తీసికొనిపోవుటకు ఆలస్యముచేయుచున్నందువల్ల ఇతరులసరకులను దింపించవీలులేక అవియుండే డబ్బాలుకూడ అట్లే ఆనేకదినములవరకునిలువవలసివచ్చుచున్నది-ఇట్లు ఆలస్యముచేసేవారు కొంత అదనపుఖర్చు కట్టుచున్నను జరిగే అసౌకర్యము మాత్రము చాలాఎక్కువగానున్నది-అందువల్ల రైల్వేవారు వర్తకులు వెంటవెంట తమతమసరకులను తీసికొనిపోవలసినదిగ విన్నపముచేయుచున్నారు-ఇప్పుడు సికింద్రాబాదుస్టేషనులో సామానుశాలలలో సామానులను వర్తకులు ఎక్కువరోజులుంచినందుకు వసూలుచేసేఖర్చీని హెచ్చించనైనది.

## హైదరాబాదుసంస్థానపు జిల్లాపోలీసుశాఖనివేదిక

౧౩౪౯ఫసలీలో హైదరాబాదు సంస్థానమందు జిల్లాలలో ప్రజలపోలీసులసంబంధములు సామరస్యముగలిగియుండెననియు రాష్ట్రమందు శాంతికాపాడుటకై ఒకవిధానమును పోలీసులుఅవలంబించుట యుద్ధకారణమువలన అవసరమయ్యెననియు ౧౩౪౯ఫ. సంవత్సరమునకు హైదరాబాదు జిల్లాపోలీసుశాఖవారి నివేదికలో తెల్పబడినది

నివేదికసంవత్సరములో పూర్వసంవత్సరముకంటె ౩౩౬ నేరములు పోలీసువారు చర్యకైకొనదగునట్టివి ఎక్కువగానుండినవి. అనగామొత్తము నివేదిక సంవత్సరములో ౧౫౬౩ అట్టినేరములు వీటిలో ౨౩౨ నేరములు అల్లరులకుసంబంధించినవి- ౧౫౩ బందిపోటులకు సంబంధించినవి. (ఇవిపూర్వసంవత్సరములోకంటె ౨౩ ఎక్కువ) ౧౯౮ దోపిడికిసంబంధించినవి పూర్వసంవత్సరముతో పోల్చిచూచినచో ౩౯తగ్గినవి) ౨౧౫౩ కన్నపుదొంగతనములు (ఇవియు ౫౩౧ తక్కువ)

౯౨౩ ఎవరుషులను నేరపుజాతులక్రింద జమకట్టి పోలీసులనిగరానిలోనుంచిరి. ౧౨౨౯ మందికి ఈబాధమినహాయించబడెను-౨౯ మందిపై నేరములు ప్రవపరచబడిశిక్షలువిధించబడినవి-

నివేదికనుముగించుచు జిల్లాపోలీసుశాఖ అధ్యక్షులగు హాలిన్సుగారు పూర్వసంవత్సరాంతమున సత్యాగ్రహమునుఅపుటవల్ల పోలీసులు తమసాధారణవిధులను నెరవేర్పగలుగుటకు వీలయ్యెననియు, ఇదివరలో గస్తువిర్పాటులను తొలగించినచోటులలో ఇప్పుడుగస్తువిర్పాటు మరలప్రారంభించబడినది- మొత్తముమీద నేరములనునిరోధించుటలో పూర్వసంవత్సరములోకంటు గట్టివిర్పాటులుచేయబడినవి-

## భారతీయవైద్యసంఘము

### హైదరాబాదు శాఖసమావేశము

హైదరాబాదు (దక్కను) అక్టోబరు ౧౬ భారతీయవైద్యసంఘముయొక్క హైదరాబాదుశాఖ గౌరవకార్యదర్శియగు డాక్టరు బి-జయరాంగారును డాక్టరు ఆర్ వెంకటరావు,కె-వి-నాయక్ గార్లును ఒకప్రకటనమవాసపంపినారు-భారతీయ వైద్యసంఘముయొక్కయు, హైదరాబాదువైద్యసంఘముయొక్కయు, బ్రిటిషువైద్యసంఘముయొక్కయు స్థానికశాఖలయాజమాన్యమున ఉస్మానియా వైద్యకళాశాలలెక్చరుహాలులో సెప్టెంబరు ౨౩ వతేదిసాయంత్రము ౫౪ గంటలకు వైద్యవృత్తినిజపుర్రకోనుడు వీరి వారల కుఇచ్చుచున్న మోటారుస్పిరిటు చాలనందువల్ల చేయవలసిన కర్తవ్యమునుగురించి ఆలోచనచేయుటకై హైదరాబాదువైద్యుల ఆసరసమావేశమొకటి జరుపబడునని అందులో తెలపబడినది-

### సర్ఫెఖాస్ లో కూడ యుద్ధకాలానికి ఉద్యోగులకు అలవెన్సు

సర్ఫెఖాస్ లోకూడ యుద్ధకాలానికి ధరలు పెరిగిన కారణముచే ఉద్యోగులకుజీతములుగాక కొంతఅలవెన్సునిచ్చుటకు ఇప్పుడుతీర్మానమైనట్లు "ఉర్దూమ్యాన్"వారికి తెలిసినట్లు "సుభేదక్కను"పత్రికలో ప్రకటించబడినది.

### గాంధిజయంతినాటిసభలు

హైద్రాబాదు (దక్కను) ఖాదీప్రచారకసంఘమువారు గాంధిజయంతిసంబంధములో ౨౫ సెప్టెంబరునాడు శ్రీ కాశీనాథరావుగారి అధ్యక్షతలో ఒకసభను, ౨అక్టోబరునాడు పండితనరేంద్రగారిఅధ్యక్షతలో ఇంకొకసభనుజరుపగలరు-ఔరంగాబాదులోకూడ గాంధిజయంతి చేసెదరట-

### మహారాష్ట్ర మహాసభశాఖ

నిజాంరాష్ట్ర మహాసభయొక్క శాఖయొకటి బలవంతరావు వకీలుగారి అధ్యక్షతలోను, శ్రీమహాజన వైద్యగారి కార్యదర్శిత్వముతోను పటక్ లో ఏర్పాటు చేయబడినది-

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౧౬-౧-౧౩౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ శేర్లతూకము

ధరలన్నీ హాలీకే

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై | |
|---|---|---|---|---|
| కిచిడిసాంబర్లు | ౨౩ నుండి ౨౮౪ | | | |
| సంబర్లు | ౨౩ | ౦ | ౦ | |
| ఢిల్లీబోగాలు | ౨౨ | ౮ | ౦ | |
| రాంసాగర్లు శేవు | ౨౧ | ౮ | ౦ | |
| సావర్రాం | ౨౧ | ౪ | ౦ | కొత్తవి |
| " | ౨౩ | ౦ | ౦ | పాతవి |
| ఆర్కాటి | ౨౧ | ౦ | ౦ | కొత్తవి |
| " | ౨౨ | ౦ | ౦ | పాతవి |
| కోసామణి | ౩౦ నుండి ౨౦ | | | వరకు |
| బుడములు | ౧౭ | ౦ | ౦ | |
| దేశావరి | ౨౦ | ౦ | ౦ | ౧౮వరకు |
| **గోధుమలు** | | | | |
| శర్బతి | ౨౨ | ౮ | ౦ | |
| బన్సి | ౨౩ | ౦ | ౦ | ౧౯ వరకు |
| అమ్మకి | ౨౦ | ౦ | ౦ | |
| పోటీయా | ౧౯ | ౦ | ౦ | |
| ఎర్రగోధుమలు | ౧౮ | ౪ | ౦ | |
| **జొన్నలు** | | | | |
| తెల్ల జొన్నలు | ౧౧ నుండి ౧౦౪ వరకు | | | |
| పచ్చజొన్నలు | ౧౦ | ౪ | ౦ | |
| మడికట్టు జొన్నలు ౧౦౫ | ౧౦ | ౦ | ౦ | |
| శెనగలు | ౧౪౫౦వరకే | | | ౧౮౧౦ కే |
| కందులు రెండవి | ౧౦ | ౧ | ౦ | |
| మినుములు | ౧౨ | ౦ | ౦ | |
| అంకలు | ౧౮ | ౮ | ౦ | |
| సజ్జలు | ౧౦ | ౫ | ౧ | |
| **పప్పులు** | | | | |
| శెనగ పప్పు | ౨౩ | ౦ | ౦ | |
| కంది " | ౧౩ | ౬ | ౦ | |
| సిరిశెనగ, ౨౧ | ౨౨ | ౮ | ౦ | |
| లంక " | ౧౮ | ౧ | ౦ | |
| మినప " | ౨౧ | ౦ | ౦ | |
| పెసర " | ౨౦ | ౦ | ౦ | |
| బెల్లము | ౧౬ నుండి ౧౮ వరకు | | | |
| ఉప్పు | ౧౨, ౧౧ | ౮ | ౦ | |
| ఉల్లిగడ్డ | ౧౬ నుండి ౧౨ వరకు | | | |
| వరుగు మంచిది | ౦ నుండి ౨ వరకు | | | |
| చక్కెర మణుము [౮౦ శేర్లు] | | | | |
| జావా " " | ౧౮ | ౦ | ౦ | |
| బొంబాయి " | ౧౩ | ౧౮ | ౦ | |
| మద్రాసు " " | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు " " | ౧౩ | ౧౨ | ౧ | |
| ఎర్రచక్కెర , పల్ల ౧౩, నుండి ౧౫ వరకు | | | | |
| దర్గచక్కెర " ౮౦ సే | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే | ౮ | ౧౨ | ౦ | |
| అల్లం " " | ౮ | ౧౨ | ౦ | |
| మణుము ౧౨ సే | | | | |
| కొబ్బెరనూనె " | ౮ | ౮ | ౦ | |
| కుసుమనూనె " | ౫ | ౦ | ౦ | |
| నువ్వులనూనె " | ౮ | ౮ | ౦ | |
| వేరుశెనగనూనె " | ౮ | ౦ | ౦ | |
| కిరోసిన్ (గ్యాస్, డబ్బా ౧కి | ౮-౧౨-౦ | | | |
| **నెయ్యి** మణుము ౮౦ శేర్లు | | | | |
| బిదరు నెయ్యి " | ౩౦ | ౦ | ౦ | |
| తెలంగానా " | ౮౫ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు॥ ౧కి | ౫౦ | ౮ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౩౧ | ౫ | ౦ | |
| " తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కి హాలీ రూ- | ౩౩ | ౮ | ౦ | |
| **మారకం** | | | | |
| హాలీక కల్దార్లు | ౧౬ | ౮ | ౦ | |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౩ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౦ | ౮ | ౦ | |
| వేరుశెనగ " | ౫ | ౮ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ | ౮ | ౦ | |
| పప్పు " | ౧౨ | ౦ | ౦ | |



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn Editor S. Prathapa Reddy B. A. B. L.